స్వాతంత్ర్య సముపార్జనలో

# మహర్షి దయానందుడు





డా॥ కోడూరి సుబ్బారావు

గాయత్రీ ఆశ్రమ ప్రచూరణ

గాయత్రీ గ్రంథమాల - 32
ప్రతులు - 1000

సృష్టి సంవత్సరము : 197,29,49,101
విక్రమాబ్దము : 2057
దయానందాబ్దము : 177
శ్రీ విక్రమ - సంక్రాంతి (2001)

**మూల్యము : రూ. 4=00** (తపాల ఖర్చులు అదనము)

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమము, వ్యాస్ వైదిక సేవా సమాజము
12-10-586/6, వ్యాస్‌నగర్, (ఇందిరానగర్ రోడ్డు, నెం. 2)
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 061.

2) మాశెట్టి శ్రీనివాస్, Shop No. 5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740 , కంచరి బజార్, సికింద్రాబాద్ - 3. ఫోన్ : 781 2904

3) ఆర్ష గురుకులము, వడ్లూరు, కామారెడ్డి - 503 111 (నిజామాబాద్ జిల్లా)

4) వైదిక సాహిత్యభండార్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 95.

5) ఆర్. కృష్ణమూర్తి, బుక్ సెల్లర్, ఆర్యసమాజము,
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 61.

Designed & Printed at
PRINTSHOP
Sec'bad. Ph : 781290



మహర్షి దయానంద సరస్వతి

# మహర్షి దయానందుని సంక్షిప్త పరిచయము

**జననము:** విక్రమ శకం 1881, భాద్రపద శు॥ నవమి (క్రీ.శ. 20-9-1824) గురువారము, గుజరాత్‌లోని టంకారా గ్రామం

**మరణము :** విక్రమ శకం 1940. కార్తీక, అమావాస్య (దీపావళి) క్రీ.శ. 20-10-1883 మంగళవారము, రాజస్థాన్‌లోని అజ్మీర్ నగరం

**జననీ జనకులు:** శ్రీమతి అమృతబాయి, శ్రీ కర్షణ జీ (సామవేదీయ ఔదీచ్య బ్రాహ్మణులు) తండ్రి భూస్వామి, రెవిన్యూ అధికారి కూడ

**బాల్యనామం :** మూల శంకరుడు

**విద్యాధ్యయనం :** చిన్నతనముననే యజుర్వేదము కంఠస్థము చేసెను. సంస్కృత వ్యాకరణ నిష్ణాతులు, కర్మకాండకు చెందిన పూర్వ మీమాంసాది గ్రంథములు అధ్యయనం చేసెను.

14వ యేట తండ్రి బలాత్కారముపై శివరాత్రి ఉపవాస జాగరణములు చేసెను. శివాలయంలో ఆనాటి రాత్రి భక్తులంతా నిద్రలోకి జారుకోగా కొన్ని ఎలుకలు బయటకు వచ్చి పండ్లు, కొబ్బరితిని, యథేచ్ఛగా శివలంగముపై గంతులు వేయుటయేగాక మలమూత్ర విసర్జన చేయుట చూచెను. ఈ శివలింగము సమస్త చరాచర సృష్టిని సంహరించి ప్రళయము చేయగల శివుడేనా? లేక మరొకరా ? అనే జిజ్ఞాస కలిగెను. వివేకము జాగృతమయ్యేను.

తదుపరి చెల్లెలు, పినతండ్రి మరణాలను చూసి విరాగియై ఇల్లు డెడలి దేశ సంచారము చేయుచు విస్తృత స్వాధ్యాయం చేసెను. వ్యాకరణ భాస్కరునిగా పేరుగాంచిన విరజానంద స్వామి వద్ద 'పాణినీ వ్యాకరణం' నేర్చుకొని వేదాల యథార్థ స్వరూపం తెలిసికొనెను. ఆ జ్ఞానదృష్టితో సంపూర్ణంగా నాలుగు వేదాలను అధ్యయనం చేసెను. పేరెన్నికగన్న, బ్రాహ్మణ ఆరణ్యక దర్శన ఆయుర్వేద, అర్థవేదాది సకల ఆర్షశాస్త్రములను అధ్యయనం చేసి పూర్ణ పాండిత్యము నందెను. లోకములో వ్యాపించి ఉన్న పౌరాణిక సాంప్రదాయములనే కాక చార్వాక, శాక్త్య, జైన, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయాది మతాంతరముల ధర్మ గ్రంథముల నన్నింటిని కూడా పరిశీలనా దృష్టితో అధ్యయనం చేసెను.

**అభిమాన విషయాలు:** అసలైన ఈశ్వరీయ గ్రాంథాలైన వేదాల పునరుద్ధరణ, వేదాల వెలుగులో ధార్మిక సాంఘిక రాజనైతిక సంస్కరణలు, దేశభక్తి, స్వాతంత్ర్య సముపార్జన, పూర్వపు ధార్మిక సార్వభౌమ చక్రవర్తి రాజ్య స్థాపన

**రచనలు:**సత్యార్థప్రకాశము, ఋగ్వేదాది భాష్యభూమిక, సంపూర్ణ యజుర్వేద భాష్యము, ఋగ్వేదము (సప్తమ మండలము, 61వ సూక్తములోని 2వ మంత్రము వరకు), సంస్కారవిధి, వ్యవహారభానువు, గోకరుణానిధి, ఆర్యాభివినయము, పంచమహాయజ్ఞవిధి ముఖ్యమైనవి. ఇవేగాక ఆర్యోద్దేశ రత్నమాలాది అనేక లఘు గ్రంథములు, నామిక, ఆఖ్యాతికాది వ్యాకరణ గ్రంథములు, ప్రవచనాలు శాస్త్రార్థాలు, లేఖలు, సంభాషణలు మొదలగునవి. ఇవన్నియు ముద్రితములై లభించును.

**రచనలలోని వైశిష్ట్యము:** ఆయన వేద భాష్యం ప్రపంచ మేధావులందరికి కనివిప్పు కల్గించింది. అంతకు ముందున్న సాయన వేదభాష్యం వేదాన్ని

సామాన్య పురాణ గ్రంథంగా మార్చివేయగా, ఉవ్వట, మహీధరుల భాష్యాలు దానిని ఒక తంత్ర గ్రంథంగా అశ్లీల గ్రంథంగా మార్చివేసాయి. వీటిని అనుసరించిన పాశ్చాత్యుల భాష్యాలన్ని ఆమార్గంలోనే సాగినవి. భారతీయుల ఆత్మగౌరవానికే అఘాతం కలిగించాయి. కాని, దయానందుని వేదభాష్యం మాత్రం భారతీయుల ఆత్మగౌరవానికి పెద్దపీట వేసింది. దానిని ఒక సృష్టి విజ్ఞాన గ్రంథంగా, హేతుబద్ధ గ్రంథంగా సర్వమానవులన సంస్కరించగల సంపూర్ణగ్రంథంగా చేసినది.

ఇక 'సంస్కారవిధి' మానవ జీవన నిర్మాణ గ్రంథం. మానవుని మహాత్మునిగా తీర్చిదిద్దగల విధి విదానాలు అందులో ఉన్నాయి. ఇట్లే మిగిలిన రచనలు నని గ్రహించివలెను. అన్నిటి విషయం వ్రాసిన బృహత్ గ్రంథమే యగును కదా ! వీటిలో 'సత్యార్థప్రకాశము' ప్రపంచ ప్రసిద్ధిని పొందినది. వివేకవంతులైన ప్రాచ్య పాశ్చాత్య వాసులందరిని సత్యాన్వేషణవైపు నడిపించింది. భారతీయ సంస్కృత సభ్యతలకు మహోన్నత స్థానం కలిగించింది. పేరుకు తగినట్లు ఆ గ్రంథము అజ్ఞానాంధకారాన్ని పోగెట్టే సత్యప్రకాశమే..



# స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు

నిజమైన శివదర్శనము చేయ ఇల్లు వెడలిన మూలశంకరుడు (దయానందుడు) దేశ సంచారము చేయ మొదలిడెను. ముందుగా శుద్ధ చైతన్య బ్రహ్మచారియై తదుపరి సంన్యాసదీక్షగైకొని దయానంద సరస్వతి అయ్యెను. యోగుల అన్వేషణలో దుర్గమారణ్యాలలో కొండ గుహలలో నదీ ఉద్గమ స్థానాలలో ఎన్నియో కష్టాల ననుభవించుచు సంచరించెను. కఠోర యోగసాధన చేసి గొప్ప తపస్వి అయ్యెను. అయినను అతని సందేహములు తీరలేదు. ఉత్తరాఖండమున జోషీ మఠ ప్రాంతమున సంచరించుచుండ పూర్ణానంద సరస్వతీ నామము గల గొప్ప విద్వాంసుడు కలడని తెలిసి వారిని కలిసికొని సందేహనివృత్తి చేసికొన గంగాతీరమును చేరెను. నూట పది సంవత్సరముల వయోవృద్ధుడైన పూర్ణానంద స్వామి దయానందుని సందేహములు విని "ఈ వృద్ధావస్థలో నీ సందేహములు దీర్చ నాశక్తి చాలదు. మథురలో నున్న నా శిష్యుడైన విరజానందుని కలిసికొమ్ము. అతడే నీ సందేహనివృత్తి చేయ సమర్థుడని చెప్పిపంపెను. ఈ సంఘటన క్రీ.శ. 1856 సంవత్సరములో జరిగెను. కాని దయానందుడు ఐదు సంవత్సరముల తదుపరియే అనగా 1861లో మథురలో నున్న విరజానందుని కలిసెను. ఈ మధ్యకాలములో (ఐదు సంవత్సరములు) దయానందుడు ఏమి చేసెను? దేశ భ్రమణము చేయుచు వ్యర్థము గానే

గడిపెనా లేక ఏదైన మహత్కార్యము చేసెనా ?

దయానందుని ఈ అజ్ఞాతవాస చరిత్రను వెలుగులోకి తీసుకు రాగోరి ఆర్యవిద్వాంసులు దయానందుని కార్యక్షేత్రపు వివిధ ప్రాంతాలలో పర్యటించిరి. చివరికి వారి సంకల్పము నెరవేరినది. ఆనాడు స్వాతంత్ర్య సంగ్రామ క్షేత్రముగా నుండెడి కాన్పూర్ ప్రాంతములో క్రీ.శ. 1856-61 మధ్యకాలంలో దయానంద స్వామి తమకు పలుమార్లు కనబడినట్లు అచటి జనులు చెప్పిరి. ఆనాడు కాన్పూరు ప్రాంతము ప్రముఖ క్రాంతి కారియైన నానాఘోండు పంతుని కార్యక్షేత్రము. సైనిక తిరుగుబాటు జరుప పథకములు నిర్మించుచున్న క్రాంతి క్షేత్ర మది. ఇంతేగాక ఆ దినములలో దేశభక్తులైన సాధుసంన్యాసులు కూడ పరోక్షముగానుండి స్వాతంత్ర్యపోరాటమునకు ప్రోత్సాహ మిచ్చుచుండెడివారు. ఆ కాలమున అనగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామము జరిగిన దినములలో సైనిక గుడారాలలో సమావేశముల నేర్పరచి స్వామి దయానందుడు సైనికులకు స్వాతంత్ర్య సంగ్రామమునకు ప్రేరణ నిచ్చెడివా డని వారు తెలిపిరి.

ఆనాటి స్వాతంత్ర్య సంగ్రామ ప్రధాన సంయోజకుడైన నానాసాహెబ్ పీష్వా దయానందుని శిష్యుడే. వీరిరువురు సహచరులుగా నుండుట ఆ ప్రాంతములో పెక్కురు తాము చూచినట్లు తెలిపిరి. ఆ కాలములోనే ఆంగ్లేయులు రణఛోడ్ మందిరమును, అందలి మూర్తిని పేల్చివేయు చుండగా దయానందుడు బాఘీర్ వీరులను ఆంగ్లేయుల నెదిరించ ప్రోత్సహించెను. అందుచేతనే తన ప్రసిద్ధ గ్రంథమైన సత్యార్థ ప్రకాశము (ఏకాదశ సముల్లాసము)లో ఆ సంఘటనను కన్నులకు కట్టినట్లు వర్ణింపగలిగెను. క్రీ.శ. 1857 విప్లవము విఫలమైన తదుపరి పీష్వా నేపాలుకు పారిపోయినా డనుట సత్యము కాదు. ఆత్మహత్య చేసికొన నిర్ణయించుకున్న పీష్వాకు దయానందుడు ధైర్యము చెప్పి మఱొక అవకాశము వచ్చువఱకు వేచి యుండుమని నచ్చ చెప్పెను. అంతవరకు

సంన్యాస దీక్షగైకొని ప్రజలకు సేవ చేయుమని ఉపదేశించెను. ప్రజలలో ధార్మిక జాగృతి కలుగుటకు ధర్మోపదేశము చేయుచు, ఐహిక లాభముకొఱకు వనౌషధ వితరణ చేయుచు గడుపుమని సలహానిచ్చెను. ఎట్టి పరిస్థితులలోను ఆత్మహత్య తలపెట్టవద్దని ఆదేశించెను. పీష్వా అందుకు అంగీకరించెను.

దయానందుడు అతనికి సంన్యాస దీక్ష నిచ్చి దివ్యానంద నామము నొసగెను. అప్పుడు పీష్వాతో పాటు దుర్జయరావు మరియు తాంత్యాతోపేలు కూడ అచ్చట ఉండిరి. కాని వారు సంన్యాసదీక్ష గైకొన సాహసింపలేక పోయిరి. తదుపరి దయానందుడు విద్యానందునకు (పీష్వాకు) కు ఒక లేఖ వ్రాసి యిచ్చి మొర్వీరాజ్య సామంత రాజు వద్దకు పంపెను. ఆ రాజు భావనగర్ (సౌరాష్ట్ర) సమీపములోని సింహొర్‌లో దివ్యానందునకు సాధువుగా గడుపుటకు ఏర్పాటు చేసెను. దివ్యానందుడు (పీష్వా) అచటనే మరణించెను. ఇప్పటికిని అతని సమాధి అచట గలదు. ఇంతేగాక శ్రీ పృథ్వీ సింహ మెహతా విద్యాలంకార్ గారిచే రచింపబడిన 'హమారా రాజస్థాన్' అను హింది గ్రంథములో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామము (క్రీ.శ. 1857) నాటి విప్లవములో దయానందునికి సంబంధమున్నట్లు గలదు. ఈ ప్రమాణములను బట్టి దయానందునకు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామములో ప్రధాన పాత్రయే యున్నట్లు తెలియుచున్నది.

రాజస్థాన్‌లో స్వాతంత్ర్యాగ్నిని ప్రజ్జ్వలింపజేసిన కేసరీసింహుడు దయానందుని శిష్యుడైన కృష్ణసింహుని పుత్రుడే. అతడే కాక అతని పుత్రుడు, సోదరుడు, మరెందరో అతని అనుయాయులై రాజస్థాన్‌లో మహత్త్వపూర్ణమైన స్వాతంత్ర్య పోరాటము సాగించిరి. 1857 విప్లవము విఫలమై ఉద్రిక్తత సద్దుమణిగిన తదుపరి 1860 నవంబరు 4వ తేదీన స్వామి పూర్ణానందుని శిష్యుడైన విరజానందుని దయానందుడు మథురలో దర్శించెను. వారివద్ద మూడు సంవత్సరములు శిష్యుడై అష్టాధ్యాయీ,

మహాభాష్య వ్యాకరణ రహస్యములను తెలిసికొనెను. వేదార్థములను గ్రహింప సమర్థుడయ్యెను. అతని సందేహములన్నియు తీరిపోయెను. స్వామి విరజానందుడు కూడ దేశభక్తుడే. అతనిలో భారతదేశ బంధవిముక్తికై తీవ్రమైన కోరిక ఉండేది. ఏకాంతమున ఆ గురుశిష్యులు (విరజానంద దయానందులు) ఇరువురును దేశ స్వాతంత్ర్యమునకై ఆలోచనలు చేయుచుండెడివారు. విరజానందుని కోరిక మేరకు గురుదక్షిణగా సత్యశాస్త్రముల ఉద్ధరణకు, మత మతాంతరములలోని అవిద్యను పారద్రోలుటకు వైదిక ధర్మ పునరుద్ధరణకు, ప్రపంచమునకు ఉపకారము చేయుటకు తన జీవితము నంకితము చేయగలనని దయానందుడు శపథము చేసెను. ఆనాటి నుండి వేదధర్మోద్ధరణకు కృషి చేయుచునే తన ఉపన్యాసాలలో, రచనలలో సందర్భము వచ్చినప్పుడల్లా దేశ స్వాతంత్ర్యమునకై ప్రేరణ నిచ్చెడివాడు. దేశ ఉన్నతికొరకు భగవంతుని ప్రార్థించెడివాడు.

దయానందుడు తాను రచించిన ఆర్యాభివినయ నామక ప్రార్థనా పుస్తకము నందును ఒక మంత్రమునకు వ్యాఖ్య వ్రాయుచు "ఓ పరమేశ్వరా! మాకు చక్రవర్తి రాజ్యము ప్రాప్తించును గాక! శత్రువులను జయించుటకు గొప్పగొప్ప అస్త్రశస్త్రములు మాకు లభించుగాక! మేము నూరు సంవత్సరములు పరాధీనులము గాక స్వాధీనులమై జీవించుదుము గాక!" అని తన కోరికను ప్రకటించెను. ఇంతేగాక ఇట్టి భావములనే ఆయన ఆంగ్లేయాధికారుల ఎదుట కూడ నిర్భయముగా వెల్లడించెడివాడు.

1873 సంవత్సరములో అప్పటి వైస్రాయి లార్డ్ నార్థ్ బ్రూక్‌తో దయానందుడు సంభాషించెను. వైస్రాయి "మీరు నిర్భయముగ క్రైస్తవ మహమ్మదీయ మతములలోని అజ్ఞానమును ప్రకటించుచున్నారు కదా మీకేమైనా రక్షణ ఏర్పాటులు కావలెనా ? అని అడిగెను. అందుకు దయానందుడు వ్యక్తిగతముగా నాకెట్టి భయమూ లేదు. అయినను

ఆంగ్లేయుల రాజ్యమున తమతమ అభిప్రాయములను ప్రచారము చేసికొను పూర్ణ స్వాతంత్ర్యమున్నది కదా ! అని సమాధానము చెప్పెను. అందుకు వైస్రాయి అట్లైన మా ఆంగ్లేయ శాసనము వలన మీ దేశమునకు లభించు ఉపకారముల గురించి మీ ఉపన్యాసములలో ప్రచారము చేయుదురా?" అని ప్రశ్నించెను. అందుకు దయానందుడు ఆవేశపూరితుడై "నేను అట్లు అంగీకరింపజాలను. ఏలన నా దేశవాసులు ప్రపంచ దేశాలతో సమానతను సంపాదించుటకు, రాజనైతికోన్నతిని పొందుటకు మాకు శీఘ్రముగా పూర్ణ స్వాతంత్ర్యము లభించవలెనని నా తీవ్ర కోరిక. అట్లే ప్రతిదినము నేను భగవంతుని ప్రార్థింతు"నని ధైర్యముగా చెప్పెను.

ఈ సంఘటన జరిగిన వెనువెంటనే లండనులో నున్న ఇండియా ఆఫీసునకు ఈ సంభాషణా వివరములను లేఖ ద్వారా తెలుపుచు "స్వామి దయానంద సరస్వతి ఈ దేశమున గొప్ప విద్వాంసుడే గాక గొప్ప సంస్కర్త. అతడు రాజనీతిని, ధర్మమును వేరువేరుగా కాక ఒక్కటిగానే చూచును. అతని పట్ల జాగ్రత్త వహించుట అత్యావశ్యక" మని వ్రాసెను. గూఢచారి విభాగమును ఈ విద్రోహి సంన్యాసి చర్యలను జాగ్రత్తగా గమనించవలెనని హెచ్చరించెను.

ఒకనాటి సాయం సంధ్యా సమయమున దయానంద మహర్షి ప్రయాగలో గంగాతీరము వెంబడి భ్రమణము చేయుచుండగా దూరముగా నొక స్త్రీ మృతి చెందిన తన బిడ్డను భుజముపై వేసుకొని విలపించుచు నదికి వచ్చుటను గాంచెను. ఒక ప్రక్కగా నిలబడి ఆమె చర్యలను నిరీక్షించసాగెను. బిడ్డను చుట్టి తెచ్చిన వస్త్రమును తీసికొని తన బిడ్డను దిగంబరముగానే నదిలో ప్రవహింప చేసెను. తదుపరి స్నానము చేసి బిడ్డకు కప్పిన వస్త్రమును ఉతికి పిండుకొని వెక్కి వెక్కి ఏడుస్తూ గ్రామములోనికి పోయెను. ఆ సంఘటనను చూసి దయానందుని హృదయము కరిగిపోయెను. మార్చుకొనుటకు తనకు రెండవ వస్త్రము

లేనందుననే గదా శవమునకు గప్పిన వస్త్రము ఉతికి తీసుకు వెళ్ళెనని గ్రహించెను. ఆహా ఎంతటి దౌర్భాగ్యము ! ఒకప్పుడు రత్నాలు రాసులుగా పోసి విపణిలో విక్రయించిన ఈ భారతావని నేడు మృత శిశువునకు కప్పుటకు వస్త్రమే లేనంత బీదదై పోయెను గదా! ఈ దీనావస్థకు విదేశీ రాజ్యమే కారణము కదా! అని ఎంతయో బాధపడెను. ఆ రాత్రంతయు మేల్కొని స్వరాజ్య ప్రాప్తికై భగవంతుని ప్రార్థించెను.

దయానందుడు సదా స్వదేశీ వస్తువులనే ఉపయోగించెడివాడు. అట్లే ప్రజలందరకు విదేశీ వస్తువులను బహిష్కరించవలె ననియు స్వదేశీ వస్తువుల నుపయోగించుచు స్వదేశ ఉన్నతికి పాటుపడవలె ననియు బోధించెడివాడు.

స్వామి దయానందుడు కేవలము దేశభక్తుడే కాదు గొప్ప గోభక్తుడు కూడ. ఆవు తల్లి తదుపరి తల్లి వంటిది. అందుచే గోవును మాతగా గౌరవించాలని దయానందుని అభిమతము. గోవు వలన కలుగు అనేక లాభములను ప్రజలకు వివరించెడి వాడు. గోకరుణానిధి పేరుతో ఒక లఘు గ్రంథమును కూడా వ్రాసెను. ఒక సందర్భమున పదవీ విరమణ చేసి స్వదేశమైన ఇంగ్లాండునకు పోవుచున్న ఒక అధికారితో "మీరు మీ దేశమునకు వెళ్లి విక్టోరియా మహారాణితో "ఈ దేశమున గోవధ ఇట్లే జరుగుచున్న యెడల 1857 నాటి విప్లవము పునరావృతము కాగలదని చెప్పు"మని హెచ్చరిక పంపెను.

1875వ సంవత్సరము బొంబాయి నగరములో ఆర్యసమాజమను సంస్థను స్థాపించి ప్రపంచమునకు ఉపకారము చేయుటయే ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశమని నియమ మేర్పరచెను. 1877లో తన శిష్యుడైన శ్యాంజీ కృష్ణవర్మను ఉన్నత విద్యాభ్యాసమునకు ఇంగ్లాండునకు పంపెను. అతడు అచ్చట బారెట్‌లా ఉత్తీర్ణుడై తిరిగి వచ్చెను. దయానందుడు అజ్మీర్‌లో స్థాపించిన 'పరోప కారిణీ సభలో అతని నొక

సభ్యునిగా చేసెను. మహర్షికి ఆంగ్లభాష బొత్తిగా రాకున్నను భారతీయులకు ఇంగ్లీషు భాషగూడ అవసరమని తలచెడివాడు. ఇంతేగాక భారతీయులు విదేశముల కేగి ఆధునిక విజ్ఞానము, ఇంజనీరింగ్ మొదలగునవి నేర్చుకొనుటయు అవసరమని యెంచెడివాడు. ఈ విషయమును గూర్చి యూరోపు విద్వాంసులతో అనేక ఉత్తర ప్రత్యుత్తరములు జరిపెను. అవియన్నియు మనకిప్పుడు ముద్రితమై 'దయానందకా పత్ర, ఔర్‌విజ్ఞాపన్' పేరున లభించుచున్నవి. దయానందుని ప్రేరణతోనే శ్యామ్‌జీ కృష్ణవర్మ 1905వ సంవత్సరములో లండన్ చేరుకొని అచ్చట ఇండియా హౌస్ అను పేరుతో ఒక కేంద్రమును స్థాపించెను. అచ్చటనే 'ఇండియన్ హోం రూల్ సొసైటీ'కి అధ్యక్షుడయ్యెను. ఆ సొసైటీ పక్షాన "ఇండియన్ సోషియాలజిస్ట్' ' అను పత్రిక ప్రకటింపబడుచుండేది. దానికి వర్మ సంపాదకుడుగా నుండి రాజనీతిని ప్రచారము చేసెను భారతదేశము నుండి వచ్చు విద్యార్థులకు వసతిని కల్పించుచూ "స్వామి దయానంద, మహారాణా ప్రతాప్, ఛత్రపతి శివాజీ మొదలగు దేశభక్తుల పేర్లతో క్షాత్రవృత్తిని (విద్యార్థి ఉపకార వేతనం) ఏర్పాటు చేయు చుండెడివాడు. వారిలో దేశభక్తిని నింపుచు క్రాంతికారులుగా తయారు చేసెడివాడు. అతని 10 సంవత్సరముల నిర్విరామ కృషి ఫలితముగా స్వాతంత్ర్య వీరసావర్కర్, సేనాని శ్రీవాపట్, లాలా హర్‌దయాల్, భాయీ పరమానంద, మదన్‌లాల్ ధీంగ్రా, మొదలగువారు క్రాంతికారులు, దేశభక్తులునై భారతమాత స్వాతంత్ర్యమునకై తమ జీవితములనే అర్పించిరి.

ఆర్య ద్రవిడ విభేదాలు ఆంగ్లేయులు సృష్టించినవే. విభజించి పాలించవలె (డివైడ్ అండ్ రూల్) అనునది వారి దుష్ట రాజనీతి. ఆర్యులు రాక పూర్వము ఇచ్చట (భారతదేశమున) మరెవ్వరును వసించి యుండలేదు. ప్రథమ మానవ సృష్టి త్రివిష్టపమున (నేటి టిబెట్ ప్రాంతమున) జరిగినట్లు మన ప్రాచీన శాస్త్రములలో గలదు. తదుపరియే వారు

కిందకు దిగి గంగా సింధు మైదానము వసించుటకు అనుకూలముగా నుండుట వలన అచ్చట స్థిరనివాసమేర్పరచుకొనిరి. అప్పటికి గంగా సింధు మైదానమంతయు అరణ్యముగా, నిర్జనముగా నుండెడిది. క్రమముగా దక్షిణ భారతము నందునను ఈ ఆర్యులే ప్రవేశించిరి. ఆర్యులు రాక పూర్వము ఈ దేశమున ద్రవిడులు నివసించెడివా రనుటయు, వారిని దక్షిణ దేశమునకు వెళ్ల గొట్టి ఉత్తర భారతమును ఆర్యులు ఆక్రమించినా రనుటయు పూర్తిగా అసత్యము. ఇది మన ప్రాచీన చారిత్రక గ్రంథములకు పూర్తిగా విరుద్ధము. మనకు విరోధములు కల్పించుటకు ఆంగ్లేయులు పన్నిన కుట్ర. వారే మన చరిత్రను తారుమారు చేసి బలవంతముగా మన విద్యా విధానములో చొప్పించిరి. దరదృష్టవశాత్తు ఇది మన భారతీయులలో జీర్ణించుకు పోయినది. స్వాతంత్ర్యము పొంది 50 సంవత్సరములు గడచినప్పటికి ఈ భావదాస్యము నుండి విడివడ లేక పోవుచున్నాము. ఈ చారిత్రక సత్యమును అనేక ప్రమాణములతో వెలుగులోనికి తీసుక వచ్చిన ఆద్యుడు మహర్షి దయానందుడే. స్వరాజ్య ప్రేరణ కూడ మొట్టమొదట ఆయన వలననే మనకు కలిగినది.

మహర్షి రచిత గ్రంథములన్నిటిలో అడుగడుగున స్వాతంత్ర్య ప్రేరణ మనకు గోచరించును. అతడు వ్రాసిన ప్రపంచ ప్రసిద్ధ సత్యార్థ ప్రకాశము భారత దేశపు ఉత్తర భాగమున అద్భుత క్రాంతిని సృష్టించినది. అందు మహోన్నతమైన మన ప్రాచీన గౌరవ వైభవాలను తేటతెల్లమగునట్లు మహర్షి విశదీకరించెను. మానవ సృష్టి ఆరంభము నుండి మహాభారత యుద్ధ కాలము వఱకు భారతీయార్యచక్రవర్తులే ప్రపంచము నంతటినీ ఏకఛత్రాధిపత్యముగా ఏలినట్లు సప్రమాణికముగా నిరూపించెను. అట్టి భారతదేశము పరతంత్రమైనందుకు మిక్కిలి విచారించుచు తన ఆవేదనను ఈ విధముగా వ్యక్త పరచెను.

“ఇక్ష్వాకులు మొదలుకొని కౌరవ పాండవుల వరకు భూగోళమందు

అంతటా ఆర్యుల రాజ్యములే యుండెడివి. ఇచటి నుండి (ఋషుల, మునుల ద్వారా) విదేశము లందును కొంత వైదిక ధర్మ ప్రచారము జరుగుచుండెడిది. వీటన్నిటికి చారిత్రక ప్రమాణము లున్నవి. అగ్ని, వాయువు, ఆదిత్య, అంగీరసుల ద్వారా నాలుగు వేదములను అభ్యసించిన ఆది ఋషి బ్రహ్మ, అతని పుత్రుడు విరాట్, విరాటుని కుమారుడు మనువు, మనువునకు మరీచ్యాది పదిమంది పుత్రులుండిరి. వీరి సంతానమే స్వయంభువాది సప్త రాజన్యులు. వారి కుమారులే ఇక్ష్వాకు మున్నగు రాజులు. ఈ రాజవంశమే ఆర్యావర్తమును (భారతదేశమును) ఆర్యులు నివసించిన దగిన ప్రదేశముగా చేసి రాజ్యమేలిన మొదటి రాజవంశము.

కాని, ఇప్పుడు ఆర్యుల దురదృష్టము వలన, సోమరితనము వలన, పొరపాట్ల వలన, పరస్పర విరోధముల వలన ఆర్యులు ఇతర దేశములపై రాజ్యము చేయుట యటుంచి ఆర్యావర్తము (భారత దేశము) నందును వారి అఖండ, స్వతంత్ర స్వాధీన, నిర్భయ రాజ్యము ఈనాడు లేకుండా పోయినది. ఉన్నదియును విదేశీయుల పాదాక్రాంతమై యున్నది. కొందరు చిన్న చిన్న రాజులు మాత్రము స్వతంత్రులుగా నున్నారు. దుర్దినములు సంభవించినపుడు దేశ ప్రజలు అనేక కష్టముల ననుభవింప వలసి వచ్చును. కాని ఎవరెంత చేసినను స్వదేశీయ స్వరాజ్యమే సర్వాంశములందును, ఉత్తమ మైనది.

విదేశీ రాజ్యము మనపై, మతభేదమును, స్వపర పక్షపాతమును కాని చూపక తల్లిదండ్రులవలె దయాన్యాయములతో పాలించినను స్వరాజ్యమంత సుఖమును కలిగింపజాలదు (సత్యార్థ ప్రకాశము, అష్టమ సముల్లాసము).

పై మహర్షి వాక్యములు కేవలము ఆర్య సమాజికులనే గాక, ఆనాటి కాంగ్రెస్ నాయకులను, క్రాంతికారులను, మేధావంతులను కూడా గొప్పగా ప్రభావితము చేసినవి. ఈ విషయమునే మహాపురుషుల

మాటలలో తెలిసికొందము రండు. (మహర్షిని గూర్చి మహాపురుషులు వ్రాసిన అభిప్రాయములు కోకొల్లలు. అన్నిటిని వ్రాసిన పెద్ద గ్రంథమే యగును. ఇచట దేశభక్తిని సూచించు కొందరి అభిప్రాయములే వ్రాయుట జరిగినది.)

1916లో స్వరాజ్యము నా జన్మహక్కు అని ఘోషించిన **లోకమాన్య బాలగంగాధర తిలకు** ఋషి దయానందుని గూర్చి వ్రాయుచు "దయానంద మహర్షి భారతీయాకాశమున తన అలౌకిక ప్రకాశముతో ప్రకాశించు జాజ్వలమైన నక్షత్రము. గాఢ నిద్రలో మునిగి యున్న భారతేదశమును మేల్కొలిపిన వీరుడు. మానవత నుపాసించు మహానుభావుడు" అని కొనియాడిరి.

ఉక్కు మనిషిగా పేర్గాంచిన **సర్దార్ పటేల్** "స్వామి దయానందుని అన్నిటికన్న గొప్పదైన యోగదానము ఈ దేశమును కింకర్తవ్య విమూఢతా అగాధములో పడిపోకుండా రక్షించుటయే. వాస్తవముగా అతడే భారతస్వాతంత్ర్యమునకు పునాదిరాయి వేసెను". అని 11-11-1950నాడు ఋషి బలిదాన దినోత్సవమున శ్రద్ధాంజలి ఘటించుచు పలికెను.

ప్రముఖ దార్శనికుడైన **సర్వేపల్లి రాధాకృష్ణుడు** "మహర్షి దయానందుడు రాజనైతిక ధార్మిక సాంస్కృతిక ఉద్ధరణకు భారము వహించిన మహానుభావుడు. స్వామీజీయే మొట్టమొదటగా స్వరాజ్య సందేశమును మనకిచ్చెను. ఆ స్వాతంత్ర్యమును రక్షించుకోవలసిన బాధ్యత మనపై నున్న"దని పలికెను.

**స్వాతంత్ర్య వీరసావర్కర్** "దయానంద మహర్షి స్వాతంత్ర్య సంగ్రామ ప్రథమ యోధుడు. హిందూజాతి రక్షకుడు మహర్షి స్థాపిత ఆర్యసమాజము రాష్ట్రమునకు గొప్ప సేవ చేసినది, చేయుచున్నది. స్వాతంత్ర్య సంగ్రామమున ఆర్యసమాజికులు మిక్కిలిగా పాల్గొనిరి. మహర్షి లిఖిత అమర "సత్యార్థ ప్రకాశము" హిందూజాతి నరనరాలలో ఉష్ణరక్తమును సంచారము

చేయించును. సత్యార్థ ప్రకాశ మున్నంత వరకు విధర్మియైన సాంప్రదాయకు డెవ్వడును తన బడాయిని ప్రదర్శించ జాలడు" అని కీర్తించెను.

నేతాజీ సుభాస్ చంద్రబోస్ "ఆధునిక భారత నిర్మాణమునకు దాని ఆచార సంబంధ పునరుద్ధరణకు, ధార్మిక పునరుద్ధరణకు కారకులైన మహాపురుషులలో స్వామీ దయానంద సరస్వతీ మొదట పేర్కొనదగినవారు" అని కొనియాడెను.

**పంజాబు కేసరి లాలా లజపతిరాయ్** "స్వామీ దయానందుడు నా గురువు. ప్రపంచములో ఆయనను మాత్రమే నేను గురువుగా భావించినాను. అయన నాకు ధర్మపిత" అని పొగడెను.

**విశ్వకవి డా॥ రవీంద్రనాథ్ ఠాకూర్** "అధునిక భారతదేశమునకు మార్గదర్శకుడైన దయానందునికి నేను ఆదర పూర్వకముగా శ్రద్ధాంజలి ఘటించుచున్నాను. పతనావస్థలో నున్న ఈ దేశమునకు ఆయన సరళ సత్యమార్గమును చూపినా" డని ప్రశంసించెను.

**సాధు టి. యల్. వాసవానీ** "దయానందుడు ఉత్కట దేశభక్తుడు. అందువలన రాష్ట్రియ వీరునిగా నెంచి ఆయనకు నమస్కరించు చున్నాను" అని తమ శ్రద్ధను ప్రకటించిరి.

**సర్ యదునాథ సర్కారు** "భారత దేశపుప్రగతి చరిత్ర వ్రాయబడునపుడు దిగంబర భిక్షువు దయానంద సరస్వతి ఉన్నత పీఠముపై ఆసీనుని చేయబడు" నని ప్రశంసించెను.

ప్రసిద్ధ ఫ్రెంచి రచయిత **రోమారోలా** : "ఋషి దయానందుడు భారతదేశపు శక్తిహీనమైన శరీరములో తన అద్భుతమైన శక్తిని, దృఢత్వమును, పరాక్రమమును నింపెను" అని కీర్తించెను.

**అనంతశయనం అయ్యంగారు** "మహాత్మాగాంధీ రాష్ట్రపిత, మహర్షి దయానందుడు రాష్ట్ర పితామహుడు. ఆయన దేశ స్వాతంత్ర్యమునకు విదేశీపాలనా నిర్మూలమునకు స్వధర్మమును, సంస్కృతిని

పునరుద్ధరించుటకు ప్రేరణ నొసగినాడు. మార్గము చూపినాడు. సమస్త ప్రపంచమును ఆర్యులను చేయుటకు ప్రేరేపించినా"డని పొగడెను.

**రావు రాజా తేజ సింహవర్మ** "సూర్య చంద్రులు భూమండలమున ప్రకాశించునంత వరకు ఋషి దయానందుని జీవితము మానవులకు మార్గదర్శకముగ నుండగల"దని తమ ఆశాభావం వ్యక్తం చేసిరి.

**పీర్ మహమ్మద్ యూనస్** "క్రైస్తవము మరియు పాశ్చాత్య సభ్యతల ముఖ్య దాడుల నుండి భారతీయులను, జాగరూకుల నొనర్చు శ్రేయస్సును పొందు సౌభాగ్యము స్వామీ దయానందునకే దక్కవలె నని సూచించుచున్నాను. 19వ శతాబ్దమున స్వామీ దయానందుడు భారతదేశమునకు చేసిన అమూల్యమైన సేవ హిందువులతో పాటు, మహమ్మదీయులకును, ఇతర మతస్థులకును చాలమేలు కలుగజేసె' నని తన సద్భావనను ప్రకటించెను.

**మేక్స్‌మూలర్** "స్వామి దయానంద సరస్వతి హిందూ ధర్మమును సంస్కరించుటకు మిక్కిలిగా యత్నించెను. సమాజమును సంస్కరించుటలో వారు ఉదార హృదయులు. వారి యాలోచన లన్నియు వేదములపై నాధారపడి యుండెడివి. ఋషుల జ్ఞానము ననుసరించి స్వామి భావము లుండెడివి. వేదములకు స్వామీజీ భాష్యము రచించెను. దానినిబట్టి స్వామీజీ పూర్ణ విజ్ఞుడని తెలియును. స్వామీజీ స్వాధ్యాయము మిక్కిలి వ్యాపక" మని ప్రశంసించెను.

**మోనియర్ విలియమ్స్** "దయానందస్వామి ఏకేశ్వరవాది, వేదముల యాధారముగా తన సిద్ధాంతముల నిర్మించినాడు. ప్రగతిని సమర్థించినాడు" అనెను

**పాల్ రిచర్డ్** "దయానంద స్వామి యొక ఋషి యనుట నిస్సందిగ్ధము. అతడు తనపై విరోధులు విసిరిన రాళ్ళను, రప్పలను శాంతి పూర్వకముగ సహించినాడు. అతడు తనలో భూత భవిష్యత్తులను

మేళవించుకొన్న వ్యక్తి. అతడు మరణించియు అమరుడే. మానవులను కారాగారవాసమునుండి ముక్తులను జేయుటకు, జాతి బంధనములను ఖండించుటకు దయానంద మహర్షి ఆవిర్భవించెను. 'ఓయార్యావర్తమా! లే, నిలబడు, నిద్రనుండి మేల్కొను సమయము వచ్చినది. నవయుగమున ప్రవేశించుము ముందుకు నడువు, అనునది మహర్షి ఆదేశము''.

మదనమోహన మాలవీయ మహర్షి దయానంద స్వామి తపోమూర్తి. అతడు భారతమున దివ్యజ్యోతిని ప్రకాశింపజేసెను. మహర్షి హిందూ సమాజమునకు పునర్జన్మ నొసగుటకు సర్వ ప్రయత్నము లొనర్చెను. అతడు భారతమును స్వతంత్రముగా, దివ్యముగా జూడదలచెను. ఆర్ష ధర్మమును మరల భారతమున వెలయింప ప్రయత్నశీలు డయ్యెను. మృతప్రాయముగా నున్న హిందూ జాతి శరీరమున మరల ప్రాణసంచారము కలిగించెను. అతడు హిందూ సంస్కృతికి అప్రతిమప్రతిమ, భారత మాతకు అక్షయపాత్ర'' అని ప్రశంసించెను.

శ్యామ్‌జీ కృష్ణవర్మ "దయానంద సరస్వతీస్వామిని నేను నా మార్గదర్శక గురువుగా నంగీకరింతును. వారి చరణసన్నిధిలో నుండి నేనెంతో నేర్చుకొన్నాను. నాపై వారికెల్లప్పుడు దయ యుండెడిది. విదేశములందును వైదిక ధర్మ ప్రచారము జరుగవలెనని స్వామి కోరుచుండెడివారు. విదేశములందు వైదిక సంస్కృతిని ప్రసరింపజేయుమని నన్ను ప్రేరేపించిరి.' ' అని తన శ్రద్ధను ప్రకటించెను. వారే మరొక సందర్భమున "రాష్ట్రమునకు, జాతికి, సమాజమునకు నే జేసిన సేవకు గల శ్రేయస్సంతయు మహర్షిదే. నేను పొందిన దానిలో సర్వహితైషి, వేద జ్ఞుడు, తేజస్వి, యుగద్రష్టయు నైన ఆ మహర్షి హస్తమే యెక్కువగా నున్నది. నే నా స్వతంత్ర విచారమునకు శిష్యుడనైనందుకు గర్వించు చున్నాను'' అని కీర్తించెను.

**లాలా హరదయాల్** ఎం.ఏ "దయానంద మహర్షి మోడువారి యున్న భారతవర్షరూప వృక్షమునకు నీరుపోసినాడు. అతడొనర్చిన ప్రయాస కారణముగ నెన్నియో స్వాదిష్టఫలము లా వృక్షమున ఫలించినవవి. ఇంకను ఫలింపనున్నవి. స్వామిపాదులు యువకుల హృదయమున త్యాగము, పరోపకారము, దేశభక్తి రూప జ్యోతిని జ్వలింపజేసిరి. నేడు హిందూజాతిలో గనబడు ఉన్నతియొక్క శ్రేయస్సు స్వామికే దక్కును' భారతవర్ష ఇతిహాసమున స్వామినామము సంస్కర్తల శ్రేణిలో ప్రప్రథమమున స్వర్ణాక్షరాలతో లిఖింపబడును' అని పొగడెను.

**విఠల్‌భాయీ పటేల్** "పలువురు దయానంద స్వామిని ధార్మిక సామాజిక సంస్కర్తగ నెంచుచున్నారు. కాని నా దృష్టిలో స్వామి సత్యమైన రాజనీతిజ్ఞుడు. నలుబది (40) వర్షములనుండి కాంగ్రెస్ ఏ కార్యక్రమము ననుసరించుచుండెనో ఆ కార్యక్రమమును దయానంద స్వామి (60) అరువది వర్షములకు పూర్వమే దేశము నెదుట నుంచెను. సమస్త దేశమున నొకే భాష, ఖద్దరు, స్వదేశీ వస్తు ప్రచారము, పంచాయతీ స్థాపన, దళితోద్ధరణ, స్వరాజ్య పద ఘోషణ అనునవి యన్నియు మహర్షి దయానందుడు దేశమున కెన్నడో యిచ్చిన వరములు. వర్తమాన కాంగ్రెసులో నున్న ప్రతి యంశము భగవాన్ దయానందుని నిర్మాణమే. వాస్తవముగ మనము భాగ్యహీనులము, నేటి కరువది (60) వర్షములకు పూర్వమే యీ కార్యక్రమమును గ్రహించి యాచరణలో పెట్టియున్న పక్షమున భారత వర్షమెన్నడో స్వతంత్రమై యుండెడిది. నేను మహర్షి దయానందుని మన రాజనైతిక గురువుగా నంగీకరింతును. నా దృష్టిలో మహర్షి గొప్ప విప్లవవాది నేత, రాష్ట్రవిధాయకుడు నై యుండెను" అని కొనియాడెను.

**లాల్‌బహదూర్ శాస్త్రీ** "దయానంద స్వామి ప్రారంభించిన కార్యము పూర్ణము చేయక విడువరైరి. వారు హిందూ ధర్మమునకు కళ్యాణము చేసిరి. వారు దృఢవ్యక్తులు వారి వంటి క్రాంతికారి నాయకులు

కానరారు. వారు హిందీని రాష్ట్రభాషగా సూచించిన మహనీయులు. అస్పృశ్యత, జాతి భేదములకు విరుద్ధముగా నాందోళన చేసిన దిట్టలు. మహర్షి భారత జాతీయ కాంగ్రెసు నిర్మాణములో పృష్ఠభూమిని సిద్ధము చేయుటకు స్వదేశ నవ్య స్వరాజ్యాందోళన జేసిన మహనీయులు". అని ప్రశంసించెను.

కె.యమ్. మున్షీ "దయానంద స్వామి వర్తమాన భారత సర్వప్రథమ మహా నిర్మాత. వారి విద్య అగాధము. చరిత్ర మహత్త్వపూర్ణము. వారి దృష్టి విలక్షణమైనది. సాధారణముగా రాష్ట్ర నిర్మాతలకు లభించు దృష్టికంటె మహర్షి దృష్టి ఎంతయో స్వచ్ఛము, విశాలమైనది" అనెను.

**ఖదీజా బేగమ్, ఎం.ఏ.** "దయానంద స్వామి విశ్వ ఇతిహాసమున నెల్లప్పుడు ప్రకాశమాన నక్షత్రము వలె ప్రకాశించు ప్రసద్ధ మహాత్ములలో నొకరుగా నుందురు. స్వామి భారతమాత సుపుత్రులు. వారి వ్యక్తిత్వముపై మనమెంత యభిమానము చూపినను నది స్వల్పమే యగును. నెపోలియన్, సికందర్ వంటి సమ్రాట్టులెందరో జగమున పుట్టిరి. కాని మహర్షి దయానంద స్వామి వారందరికంటె మిక్కిలి గొప్పవారు" అని తన శ్రద్ధను ప్రకటించెను.

**మౌలనా హసరత్ మోహినీ** "ఇతరులు స్వరాజ్య విషయమున కలలు కంటున్న సమయమునకు పూర్వమే దయానంద స్వామి, ఆర్యసమాజము, తమ పుస్తకముల ద్వారా స్వరాజ్యమును గూర్చి ప్రచారము చేయ నారంభించిరి. అసహాయోద్యమ యుగమునకు పూర్వమే సుమారు నూటికి 90 మంది ఆర్య సమాజికులు స్వరాజ్య కార్యములలో నిమగ్నులై యున్న నాయకులనియు, అప్పుడు ఇతర సంఘములవారు నూటికిద్దరో ముప్వురో స్వరాజ్య కార్యములలో పాల్గొనుచుండువా రనియు నేను ప్రసన్నతతో చెప్పగల" నని తన సద్భావనను వ్యక్తము చేసెను.

**డా॥ పట్టాభి సీతారామయ్య** "నాటి సహాయ నిరాకరణ ఉద్యమంల్ పాల్గొన్న వారిలో నూటికి ఎనభైశాతం ఆర్యసమాజీయులో లేక మహర్షి దయానంద గ్రంథపఠనంచే ప్రేరితులైనవారో ఉండిరి" అని "కాంగ్రెస్ చరిత్ర" అనెడి తాను రచించిన పుస్తకములో వ్రాసెను.

**శ్రీమతి అనిబిసెంట్** "భారతదేశము భారతదేశ నివాసులకే అను నినాదము నిచ్చినవారిలో స్వామి దయానందుడు మొదటి వ్యక్తి ఆర్యసమాజము పట్ల నా హృదయములో శుభకామన లున్నవి. ఆర్యులచె నాదరింపబడు నా మహాపురుషునందు నా హృదయములో సత్యమైన పూజ్యభావన యున్నది" అని తన సద్భావనను వ్యక్తము చేయుటయే గాక, కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ సమావేశములో "భవిష్యత్‌ల భారత స్వరాజ్య మందిరము నిర్మింప బడినపుడు అందు పెద్దపెద్ద నేతల మూర్తులు నెలకొల్పబడును. ఆ మూర్తులలో మహర్షి దయానందుని మూర్తియే మహోన్నతమై భాసిల్లును గాక" అని ఉద్ఘోషించెను.

కాని, మనకు స్వాతంత్ర్యమువచ్చి ఏభైవసంతాలు గడచిపోయినా అట్టి మందిర నిర్మాణము జరుగలేదు. ఇంతేగాక, ఆ స్వాతంత్ర్యపోరాటంలో తను మను ధనాదులతో అంకితమై పోరాడిన అందరి నాయకులకు నేడు సరియైన గుర్తింపులేదు. ఒక వర్గపు నాయకులకే ఆ గుర్తింపు లభించినది. వారి ప్రచారమే జరుగుచున్నది. చరిత్రలో పాఠ్యపుస్తకాలలో వారికే స్థానం లభిస్తోంది. దీనికి కారణం తమ వర్గ నాయకులకే రాజ్యాధికారం కలకాలం నిలిచిఉండాలనే స్వార్థం కావచ్చు. ఝాన్సీ లక్ష్మీబాయి, సుభాష్ చంద్రబోస్, వీరసావర్కర్, అల్లూరి సీతారామరాజు మొదలగువారికి నామమాత్రపు గుర్తింపు లభిస్తుండగా-మహర్షి దయానంద సరస్వతి, బందా బైరాగి, నానాజీ, తాంతియాతోపే, శ్యాంజీ కృష్ణవర్మ మొదలగువారికి అసలు గుర్తింపు లేనే లేదు.

వీరిలో మహర్షి దయానందుడు అగ్రగణ్యుడని చెప్పవచ్చును.

వారు క్రాంతిలోనే ప్రగతిని, క్రాంతిలోనే శాంతిని దర్శించిన మహామనీషి. వారిలో దైవభక్తి, దేశభక్తి ఒకదానితో నొకటి పెనవేసుకొని ఉండుట గాంచగలం. అందుకు వేదోపదేశమే - సృష్టికర్తయైన పరమేశ్వరుని ఉపదేశమే కారణం. వేదం -

"మాతా భూమిః పుత్రో అహం పృథివ్యాః" (అథర్వ. 12-1-12)

ఈ భూమి నా తల్లి, నేను ఆ మాతృభూమికి పుత్రుడను" అని సంకల్పము చేయుమంటుంది.

"ఉపసర్ప మాతరం భూమిమ్" (ఋగ్. 10-18-10)

"నీ మాతృభూమిని సేవింపుము, రక్షింపుము" అని ఉపదేశిస్తుంది. "వయం తుభ్యం బలిహృతః స్యామ" (అథర్వ. 12-1-62) " ఓ మాతృభూమీ! నీ రక్షణకై మా తనుమనో ధనములను సమర్పింతుము గాక!" అని ప్రతిజ్ఞ చేయుమంటుంది. ఇట్టి ఉపదేశాలు వేదాలలో కోకొల్లలు. అథర్వ వేదంలో 12వ కాండంలోని 63 మంత్రాలు గల మొదటి సూక్తమంతా దేశభక్తి ప్రేరకమే. పూర్తిగా మరుగున పడిపోతున్న అట్టి వేదాలను పునరుద్ధరించి, జాతి కుల మత ప్రాంత స్త్రీ పురుష భేదం లేకుండా మానవ మాత్రులందరికి వాటిని అందించిన ఘనత ఒక్క దయానందునికే దక్కుతుంది. అతడు వేదాల వెలుగులో జాతిని సంస్కరించి, దేశ ప్రగతికి దారి చూపిన అనన్య దేశభక్తుడు. అట్టి మహర్షికి ఈ జాతి ఎంతో ఋణపబడి ఉంది. వారి మందిరాలు కట్టి మూర్తులను పెట్టి పూజలు చేయనక్కరలేదు. వారు చూపిన ప్రగతి బాటలో పయనించి మరల ప్రపంచ గురువులమై భాసిల్లుటయే వారికి మనం అర్పించదగిన అసలైన శ్రద్ధాంజలి.

**క్రాంతి రస్తు ! ప్రగతి రస్తు! శాంతి రస్తు !**

**మహర్షిర్ దయానందో - విజయతామ్ !**

శమ్ ఇతి ఓమ్

# మాతృభూమికి వందనమ్








భద్ర మిచ్ఛన ఋషయః స్వర్విదస ః
తపో దీక్షా ముపనిషేదు రగ్రే ।
తతో రాష్ట్రం బలమోజశ్చ జాతం
తదస్మై దేవా ఉపసంనమన్తు॥

- అథర్వవేదం (19-

పరమేశ్వర ఆనందమును పొందిన ఋషులు లోక కల్యా గోరుచు ముందుగా తపోదీక్షలను గ్రహించిరి. ఆ తపో దీక్ష రాష్ట్రము (దేశము)ను, దాని రాజ్యాంగము (Constitutior రూపొందించిరి. వాటి ననుసరించియే రాష్ట్రీయ బల ఓజ నిర్మించబడినవి. అందుచే ఆ రాష్ట్ర రాజ్యాంగముల ఎదుట విద్వాంసు విజ్ఞానవేత్తలు, వీరులు, నాయకులు, ప్రజలు నతమస్తకు లగుదురు వాటిని సత్కారపూర్వకముగా స్వీకరింతురు గాక!